# వ్రత విధానము

కలియుగంలో శ్రీ నరసింహ స్వామి వారి అనుగ్రహం పొందడానికి ఈ వ్రతం ఆచరించడం అతి తేలికైన మార్గం. ఈ వ్రతమాచరించిన వెంటనే ఎటువంటి కష్టాలైనా తీరిపోతాయి. సాక్షాత్తూ శ్రీ నారసింహుడే అనుగ్రహించిన ఈ వ్రతం ఆచరించడం అతి సులభం. ఈ వ్రతాన్ని ఎవరైనా, ఎప్పుడైనా ఆచరించవచ్చును. ఆర్థిక బాధలు గాని, ఆరోగ్యబాధలు గాని, మరే ఇతర ఏ కారణాల వలనైనా మనశ్శాంతి లేనప్పుడు ఈ వ్రతం ఆచరించినదే తడవుగా అన్ని కష్టాలూ తీరిపోతాయి. అలాగే మీ ఇంట్లో ఏ శుభ కార్యం తలపెట్టినప్పుడైనా కూడా ఈ వ్రతం చేసుకొనవచ్చును. ఉద్యోగ, వ్యాపారాభివృద్ధి నిమిత్తం కూడా ఈ వ్రతమాచరించి ఎంతో అద్భుత ఫలితాలను వెంటనే పొందగలరు.

ఈ వ్రతాన్ని ముందు చెప్పిన విధంగా ఎప్పుడైనా ఆచరించవచ్చును. ప్రత్యేకించి మాఘ, వైశాఖ, శ్రావణ, కార్తీక, మార్గసిర మాసములలో గాని దశమి, ఏకాదశి, పౌర్ణమి తిథులయందు గాని, పూర్వా ఫల్గుణి, స్వాతి, శ్రవణ నక్షత్ర దినములందు గాని ఆచరించిన మిక్కిలి ఫలదాయకము.

ఉదయమున గాని, సాయంత్రమున గాని ఈ వ్రతమాచరించ వచ్చును. ఈ వ్రతము ఐదు అధ్యాయములతో కూడినది. మీ స్వగృహమందుగాని, వసతి గృహమందు గాని, శ్రీ స్వామివారి ఆలయమందుగాని, ఏ పుణ్య క్షేత్రములయందుగానీ, నదీ తీరమున గాని వ్రతమాచరించవచ్చును.

వీలున్నంతవరకూ బంధుమిత్రులందరినీ పిలుచుకొని ఆచరించ వలెను. ముందుగా ఈ వ్రతమును చేసుకొనే ప్రదేశాన్ని శుభ్రం చేసుకోవాలి. తరువాత మంటపమును ఏర్పాటు చేసుకుని అందు శ్రీ లక్ష్మీ నరసింహ స్వామివారి పటమును ఉంచుకొనవలెను. అటు తర్వాత కలశస్థాపన చేసుకొనవలెను.

నవగ్రహ దేవతలను అష్ట దిక్పాలకులను ఆవాహన చేసుకొనవలెను. లేక వారందరికి మనస్సులోనే నమస్కరించవచ్చును.

ముందుగా పసుపు వినాయకుణ్ణి పూజించి వ్రతము నిర్విఘ్నముగా కొనసాగుటకు ప్రార్థించవలెను. ఐదు అధ్యాయముల వ్రత కథను పఠించవలెను.

ఈ వ్రతాన్ని ఎవరైతే భక్తి శ్రద్ధలతో జరుపుతారో, ఆ ప్రదేశమునకు తానే స్వయంగా ఏదో ఒక రూపంలో వచ్చి ప్రసాదాన్ని స్వీకరిస్తానని శ్రీ స్వామివారే స్వయంగా సెలవిచ్చారు.

సాక్షాత్తూ శ్రీ స్వామి వారే సెలవిచ్చిన మరొక విశేషం ఏమనగా ఒకవేళ మనలో ఎవరికైనా ఎటువంటి కష్టమైనా కలిగి ఇంత వివరముగా ఈ వ్రతము ఆచరించడానికి తగిన సమయము గాని, వేరే కారణాల చేత గాని కుదరని ఎడల ఒంటరిగా కూర్చుని కూడా ఈ వ్రతమాచరించవచ్చును.

శ్రీ స్వామి వారి పటము ముందు కూర్చుని ముందుగా విఘ్నేశ్వరుని మనస్సులో ప్రార్థించి, తరువాత అష్ట దిక్పాలకులు, నవగ్రహ దేవతలకును, మనస్సులోనే నమస్కరించవలెను. తులసీ దళములు, కొబ్బరికాయ, అందుబాటులో ఉన్న ఫలములను, పుష్పములను పళ్ళెములో ఉంచుకొనవలెను. శ్రీ స్వామివారికి నమస్కరించి వ్రత కథలన్నీ మనస్సులోనే చదువుకుని చివరన కొబ్బరికాయను, ఫలములను శ్రీ స్వామివారికి నివేదించవలెను, అవి ప్రసాదముగా స్వీకరించినచో మీ కష్టములు వెంటనే తొలగిపోగలవు.

ప్రతి కథ సమాప్తమైనపుడు ఒక కొబ్బరికాయను నివేదించవలెను. చక్కెర కలిపిన గోధుమరవ్వ కానీ, బొంబాయి రవ్వ కానీ ప్రసాదముగా నివేదించవలెను. దీనితోపాటు పులిహోరను కూడా నివేదించిన శ్రేష్ఠము.

స్వామి వారికి తులసీ దళమన్న మిక్కిలి ప్రియము. కావున పూజలో తులసీ దళములను నివేదించిన అత్యంత ఫలము కలుగును. వ్రతము పూర్తి అయిన పిదప ఆ తులసీ దళములను అందరూ ప్రసాదముగా తీసుకొన్నచో అన్ని రోగములూ నశించి, అష్టైశ్వర్యములు కలుగును. వ్రత సమాప్తి కాగానే కొబ్బరి కాయను కొట్టి కొబ్బరి ముక్కలు మహా ప్రసాదముతో కలిపి శ్రీలక్ష్మీనారసింహులకు నివేదించి మీరు స్వీకరించి వచ్చినవారందరికి ఇచ్చినచో ఎంతో పుణ్యము లభించును.

కావున ఈ వ్రతమును వీలున్నచో తప్పక యథావిథిగా కలశస్థాపనతో వివరముగా జరుపుకొనవలెను. వీలు కాని ప్రత్యేక పరిస్థితులలో మాత్రము పైన చెప్పిన రెండవ విధముగా కూడా ఆచరించవచ్చును.

ఒక్కటి మనందరం గుర్తుంచుకొనవలెను. మన కష్టములన్నియు విశ్వమంతటిలో ఆ స్వామివారికి తెలిసినట్లుగా మరెవరికీ తెలియవు. కావున ఆ దయామయుని ప్రార్థించి, సంకల్పించి వ్రతమాచరిస్తే తప్పక మనోసిద్ధి నెరవేరగలదు. అన్ని కష్టములూ తొలగిపోయి అష్టైశ్వర్యములు లభించగలవు.

సమస్త సన్మంగళానిభవంతు
శ్రీ లక్ష్మీ నారసింహ కటాక్ష సిద్ధిరస్తు.

# శ్రీ లక్ష్మీ నరసింహ వ్రత కల్పము

## శ్రీ గణపతి ధ్యానం

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥
తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥

## ఆచమనం

ఓం కేశవాయ స్వాహా
నారాయణాయ స్వాహా
మాధవాయ స్వాహా
ఓం గోవిందాయనమః
ఓం విష్ణవేనమః
ఓం మధుసూదనాయ నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం వామనాయ నమః

ఓం శ్రీధరాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం సంకర్షణాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః

ఓం పురుషోత్తమాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నారసింహాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం జనార్ధనాయనమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం హరయే నమః
ఓం శ్రీ కృష్ణాయనమః

## భూతోచ్ఛాటనము

ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః ఏతే భూమి భారకాః
ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మ సమారభే

(అక్షతలు వెనుకకు వేయవలెను. అనంతరం కుడి చేతితో ముక్కు మూసికొని ప్రాణాయామం చేయవలయును)

## ప్రాణాయామం

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్, ఓం అపోజ్యోతీరసో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్త మానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వనర్తే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరత వర్షే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య..... (శ్రీశైలానికి వ్రతం చేసేవారి ఊరు ఏ దిక్కులో ఉందో, ఆ దిక్కుని చెప్పాలి) ప్రదేశే, కృష్ణా గోదావరీ మధ్యభాగే (ఏ నదుల మధ్య ప్రాంతంలో వుంటే ఆ నదుల పేర్లు చెప్పవలెను). స్వ / శోభన గృహే, సమస్త దేవతా బ్రాహ్మణ, హరిహర సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన స్వస్తిశ్రీ ప్రభవాది నామ సంవత్సర మధ్య (ప్రస్తుతం జరుగుతున్న సంవత్సరం ఆయనం, ఋతువు, మాసం, పక్షం తిథి వారములను క్రమంగా చేర్చి చెప్పుకోవలెను) సంవత్సరే ఆయనే.. ఋతౌ, మాసే.... పక్షే.. తిథౌ వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్.. గోత్రః.... నామధేయః ధర్మపత్నీ సమేతస్య అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య ధైర్య విజయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ దేవతా ముద్దిశ్య శ్రీ నరసింహ దేవతా ప్రీత్యర్థం వ్రతకల్ప కరిష్యే ద్రవ్యైః సమ్భవద్భిః పదార్థై సమ్భవతా నియమేన యావచ్ఛక్తి ధ్యానా వాహనాది షోడశోపచార పూజాం కరిష్యే

(నీటిని స్పృశించాలి)

## తదంగ కలశారాధనం కరిష్యే

(ఉదకమును వదలవలయును. సంకల్పమునకూ, ఆచనమునకూ వాడు పాత్రను కలశారాధనముకు వాడరాదు. స్వామికి కుడివైపున కలశము నుంచి దానికి గంధం, కుంకుమ, అక్షతలూ మూడు ఉంచి కలశంలో పువ్వు వైచి క్రింది శ్లోకాన్ని చెప్పవలయును)

## కలశారాధనం

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాశ్రితాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదో థ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశామ్బు సమాశ్రితాః
కలశే గంధ పుష్పాక్షతాన్ నిక్షిప్త్య, హస్తేనాచ్ఛాద్య,

ఆపో వా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణవా ఆపః పశవ ఆపోన్న మాపోమృత మాప స్సమ్రాడాపో విరాడాప స్వరాడాపశ్ఛందాగ్‌ంస్యాపో జ్యోతీగ్ం ష్యాపో యజూగ్‌ంష్యాప స్సత్యమాప స్సర్వా దేవతా అపోభూర్భువస్సువ రాప ఓమ్.

*(కలశాన్ని ఉదకంతో నింపి అందులో తులసీ దళాన్ని వేయవలయును)*

శ్లో॥ గంగే చ యమునేచైవ గోదావరి సరస్వతీ।
నర్మదే సింధు కావేరీ జలే స్మిన్ సన్నిధింకురు

శ్లో॥ కావేరీ తుంగ భద్రాచ కృష్ణవేణీచ గౌతమీ
భాగీరథీచ విఖ్యాతా పంచగంగా ప్రకీర్తితాః
కలశోదకేన దేవమాత్మానం పూజాద్రవ్యాణి చ సంప్రోక్ష్య.
*(కలశమునందలి ఉదకాన్ని పువ్వుతో స్వామి పైననూ, పూజాద్రవ్యాలపైనా తమ పైననూ చల్లుకోవాలి)*

## శ్రీ గణపతి ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥
అదౌ నిర్విఘ్నేన వ్రత పరిసమాప్త్యర్థం గణపతి పూజాం కరిష్యే.

## అథగణపతి పూజా

శ్లో॥ గణానాం త్వాంగణపతిగ్ం హవామహే
కవిం కవీనా ముపమశ్రవస్తవం.

జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్య న్నూతిభి స్సీదసాధనమ్.
శ్రీ మహాగణాధిపతయే నమః, ధ్యాయామి, ధ్యానం సమర్పయామి.
ఆవాహయామి, రత్న సింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం
సమర్పయామి, హస్తయో రర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం
సమర్పయామి.

శ్లో॥ ఆపోహి ష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన, మహేరణాయ చక్షసే,
యో వశ్శివత మోరసస్తస్య భాజయతేహనః ఉశతీరివ మాతరః
తస్మాఅరం గమామవో యస్యక్షయాయ జిన్వథ, అపోజనయథాచనః
శ్రీ మహాగణాధిపతయే నమః స్నపయామి స్నానాంతరం శుద్ధా చమనీయం సమర్పయామి.

శ్లో॥ అభివస్త్రాసు వసనాన్యర్ షాభిదేనూస్సు దుఘాః పూజమానః
అభిచంద్రా భర్త వే నో హిరణ్యాభ్యశ్వాన్‌రథినోదేవ సోమ
శ్రీ మహాగణాధిపతయేనమః, వస్త్రయుగ్మం సమర్పయామి.

మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్,
ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః
శ్రీ మహాగణాధిపతయేనమః, యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్లో॥ గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం,
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తా మిహోపహ్వయే శ్రియమ్,
శ్రీ మహాగణాధిపతయేనమః, దివ్యశ్రీ చందనం సమర్పయామి.

శ్లో॥ ఆయనే తే పరాయణే దుర్వా రోహంతు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే.
శ్రీ మహాగణాధిపతయేనమః, దూర్వాది నానా విధ పుష్పాణి పూజయామి.

# అథశ్రీ షోడశనామ పూజా

ఓం సుముఖాయ నమః
ఓం ఏకదంతాయ నమః
ఓం కపిలాయ నమః
ఓం గజకర్ణికాయ నమః
ఓం లంబోదరాయ నమః
ఓం వికటాయ నమః
ఓం వక్రతుండాయ నమః
ఓం శూర్పకర్ణాయ నమః
ఓం హేరంబాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం గణాధిపతయే నమః
ఓం ధూమకేతవే నమః
ఓం గణాధ్యక్షాయ నమః
ఓం ఫాలచంద్రాయ నమః
ఓం గజాననాయ నమః
ఓం స్కంద పూర్వజాయ నమః
ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః
ఓం శ్రీమహాగణాధిపతయే నమః

## నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి

శ్లో॥ వనస్పత్యుర్భవైర్దివ్యై నానా గంధైస్సు సంయుతః
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం
శ్రీ మహాగణాధిపతయే నమః, ధూపమాఘ్రాపయామి

శ్లో॥ సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియం,
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరావహం,
భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే,
త్రాహి మాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోస్తుతే
*శ్రీ మహాగణాధిపతయేనమః, దీపం సమర్పయామి, ధూపదీపా నంతరం ఆచమనీయం సమర్పయామి.*

నైవేద్యం : చిన్న బెల్లపు ముక్క ఉంచి దాని చుట్టూ నీళ్ళు చల్లి సంప్రోక్షించుచూ ఓం భూర్భువస్సువః ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్. సత్యం త్వర్తేన పరిషించామి (ఋతం త్వా సత్యేన పరిషించామి అని రాత్రి చెప్పవలెను).

శ్రీ మహాగణాధిపతయేనమః, గుడోపహారనైవేద్యం సమర్పయామి
అమృతమస్తు అమృతోపస్తరణమసి
*ఓం ప్రాణాయస్వాహా ఓం అపానాయస్వాహా ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.*

అమృతాపిధాన మసి ఉత్తరాపోశనం సమర్పయామి.
హస్తౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం,
ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం
తాంబూలం సమర్పయామి.

*మం : గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తవం. జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వ న్నూతిభి స్సీద సాదనం శ్రీ మహాగణాధిపతయే నమః, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.*

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప,
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే.

*అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్య విఘ్నమస్త్విితి భవంతో బ్రువంతు ఉత్తరే కర్మణ్య విఘ్నమస్తు గణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి.*

శ్లో॥ సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా,
సర్వగ్ం హరతు మే పాపం దూర్వాదుస్స్వప్న నాశనీ,
గణపతిం యధాస్థానము ద్వాసయామి,

*మం : యజ్ఞేన యజ్ఞమయ జంత దేవా స్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ తేహనాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వేసాధ్యా స్సంతిదేవాః పునరాచమనం.*

## ప్రాణ ప్రతిష్ఠ

మంః ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః
ప్రాణమిహనోదేహి భోగం జ్యోక్పశ్యేమ
సూర్యముచ్చరన్త మనుమతే మృడయాన స్వస్తి
అమృతం వైప్రాణా అమృతమాపః ప్రాణానేవ
యధాస్థానముపహ్వయతే
(ప్రతిమను స్పృశించాలి)

శ్రీ నరసింహ స్వామి ఆవాహయామి, స్థాపయామి, పూజయామి
స్థిరోభవ, వరదోభవ సుప్రసన్నో భవ, స్థిరాసనం కురు.

## ధ్యానం

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘ వర్ణం శుభాఙ్గమ్
లక్ష్మీ కాంతం కమలనయనం యోగిహృధ్యాన గమ్యమ్
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
*ధ్యాయామి, ధ్యానం సమర్పయామి (పుష్పాన్నైనా పత్రాన్నైనా ఉంచవలెను)*

## ఆవాహనం

శ్లో॥ ఆవాహయామి దేవేశ సిద్ధగన్ధర్వ సేవిత
యద్రహస్యమిదం పుణ్యం సర్వపాపహరోహరః
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః ఆవాహయామి

## ఆసనం

శ్లో॥ దేవ దేవ జగన్నాథ ప్రణుత క్లేశనాశన
రత్న సింహాసనం దివ్యం గృహాణ మధుసూదన
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
*రత్నసింహాసనం సమర్పయామి (పుష్పపత్రాలలో దేన్నైనా ఉంచవలెను)*

## పాద్యం

శ్లో॥ వాంచితం కురుమే దేవ దుష్కృతం చ వినాశయ
పాద్యం గృహాణ భగవాన్ మాతురుత్సజ్గ సంస్థిత
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
*పాదయో, పాద్యం సమర్పయామి (నీటిని పళ్ళెంలో విడువవలయును)*

## అర్ఘ్యం

శ్లో॥ కురుష్వమే దయాం దేవ సంసారార్తి భయాపహ
దధిక్షీర ఫలోపేతం గృహాణార్ఘ్యం నమోస్తుతే
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
హస్తయోరర్ఘ్యం సమర్పయామి *(ఉదకాన్ని పళ్ళెంలో విడువవలయును)*

## ఆచమనం

శ్లో॥ నమ స్సత్యాయ శుద్ధాయ నిత్యాయ జ్ఞానరూపిణే
గృహాణాచమనం దేవ సర్వలోకైక నాయక
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
ముఖే ఆచమనీయం సమర్పయామి.
*(నీటిని పళ్ళెంలో విడువవలయును)*

## పంచామృతస్నానం

శ్లో॥ పంచామృతం మయానీతం పయోదధిఘృతం మధు
శర్కరా సహితం చైవదేవత్వం ప్రతిగృహ్యతాం
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
పంచామృత స్నానం సమర్పయామి
*(పంచామృతములనగా ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె పంచదార నీరు కలిసినవి వీటితో స్వామిని అభిషేకించాలి)*

## స్నానం

శ్లో॥ నారికేళోదకం గంగా యమునాది సమన్వితం
శుద్ధోదకం గృహాణేశ స్నానం కురు యధావిధి
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
శుద్ధోదక స్నానం సమర్పయామి (ఉదకమును విడువవలయును)

# వస్త్రం

శ్లో॥ తప్తకాంచన సంకాశం పీతాంబర మిదం హరే
సుగృహాణ జగన్నాథ శ్రీనివాస నమోస్తుతే
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
**వస్త్రయుగ్మం సమర్పయామి (వస్త్రయుగ్మం సమర్పించనిచో ప్రత్తినే కొద్ది పొడవుగా చేసి పసుపు కుంకుమ లంటించి సమర్పించవచ్చు.**

# యజ్ఞోపవీతం

మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చశుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
యజ్ఞోపవీతం సమర్పయామి (ప్రత్తి నుంచి పోగు లాగి పసుపు కుంకుమ లంటించి అటువంటివి రెండింటిని సమర్పించవలయును. యజ్ఞోపవీతార్థం పుష్పం అని పువ్వు వెయ్యవచ్చును.)



# గంధం

శ్లో॥ చందనాగరు కస్తూరీ ఘనసార సమన్వితం
గంధం గృహాణ గోవింద నానాగంధాంశ్చధారయ
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
దివ్య పరిమళ గన్ధాన్ సమర్పయామి (చందనమును సమర్పించవలయును)

# అక్షతలు

శ్లో॥ గోవిందా పరమానంద హరిద్రా సహితాక్షతాన్
విశ్వేశ్వర విశాలాక్ష గృహాణ పరమేశ్వర
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
అక్షతాన్ సమర్పయామి (అక్షతలు వేయవలెను) పుష్పైః పూజయామి

## పుష్పం

శ్లో॥ సుగంధీని సుపుష్పాణి జాజీకుందముఖానిచ।
మాలతీ వకుళాదీని పూజార్థం ప్రతిగృహ్యతామ్।
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
పుష్పం సమర్పయామి (పుష్పములు వేయవలెను)

## అథాంగ పూజ

ఓం శ్రీ నారసింహాయ నమః - పాదౌ పూజయామి
ఓం శ్రీ మహాసింహాయ నమః - గుల్ఫౌ పూజయామి
ఓం శ్రీ దివ్యసింహాయ నమః - జానునీ పూజయామి
ఓం శ్రీ మహాబలాయ నమః - జంఘే పూజయామి
ఓం శ్రీ ఉగ్రసింహాయ నమః - ఊరుం పూజయామి
ఓం శ్రీ స్థంభజాయ నమః - కటిం పూజయామి
ఓం శ్రీ పరబ్రహ్మాయ నమః - నాభిం పూజయామి
ఓం శ్రీ సదాశివాయ నమః - ఉదరం పూజయామి
ఓం శ్రీ త్రివిక్రమాయ నమః - హృదయం పూజయామి
ఓం శ్రీ సర్వాద్భుతాయ నమః - స్తనౌ పూజయామి
ఓం శ్రీ పురుషోత్తమాయ నమః - భుజౌ పూజయామి
ఓం శ్రీ వజ్రనఖాయ నమః - హస్తౌ పూజయామి
ఓం శ్రీ అచ్యుతాయ నమః - కంఠం పూజయామి
ఓం శ్రీ మహాత్మనే నమః - స్కంధౌ పూజయామి
ఓం శ్రీ మహాజ్వాలాయ నమః - ముఖం పూజయామి
ఓం శ్రీ మహాప్రభవే నమః - నాసికాం పూజయామి
ఓం శ్రీ పుణ్య శ్రవణ కీర్తనాయ నమః - శ్రోత్రే పూజయామి
ఓం శ్రీ ఉగ్రలోచనాయ నమః - నేత్రే పూజయామి
ఓం శ్రీ వర్చస్వినే నమః - లలాటం పూజయామి
ఓం శ్రీ రమ్య విగ్రహాయ నమః - సర్వాణ్యంగాని పూజయామి
ఓం శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ పరమాత్మనే నమః
దివ్యసుందర విగ్రహం పూజయామి

# శ్రీ లక్ష్మీనృసింహ అష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.

నారసింహాయ
మహాసింహాయ
దివ్యసింహాయ
మహాబలాయ
ఉగ్రసింహాయ
మహాదేవాయ
స్తంభజాయ
ఉగ్రలోచనాయ
రౌద్రాయ
సర్వాద్భుతాయ
శ్రీమతే
యోగానందాయ
త్రివిక్రమాయ
హరయే
కోలాహలాయ
చక్రిణే
విజయినే
జయవర్ధనాయ
పంచాననాయ
పరబ్రహ్మాయ
ఘోరాయ
ఘోర విక్రమాయ
జ్వలన్ముఖాయ
జ్వాలామాలినే
మహాజ్వాలాయ
మహాప్రభవే
నిటలాక్షాయ
సహస్రాక్షాయ
దుర్నిరీక్షాయ
ప్రతాపనాయ
మహాదంష్ట్రాయుధాయ
ప్రాజ్ఞాయ
చండ కోపాయ
సదాశివాయ
హిరణ్యకశిపుధ్వంసినే
దైత్యదానవభంజనాయ
గుణభద్రాయ
బలభద్రాయ
సుభద్రకాయ
కరాళాయ
వికారాళాయ
వికర్త్రే
సర్వకర్తృకాయ
శింశుమారాయ
త్రిలోకాత్మనే
ఈశాయ
సర్వేశ్వరాయ
విభవే
భైరవాడంబరాయ
దివ్యాయ
అచ్యుతాయ
కవిమాధవాయ
అధోక్షజాయ
అక్షరాయ
శర్వాయ
వనమాలినే
వరప్రదాయ
విశ్వంభరాయ
అద్భుతాయ
భవ్యాయ
శ్రీ విష్ణవే
పురుషోత్తమాయ
అనఘాస్త్రాయ
నఖాస్త్రాయ
సూర్యజ్యోతిషే
సురేశ్వరాయ
సహస్రబాహవే
సర్వజ్ఞాయ
సర్వసిద్ధిప్రదాయకాయ
వజ్రదంష్ట్రాయ
వజ్రనఖాయ
మహానందాయ
పరంతపాయ
సర్వమంత్రైక రూపాయ
సర్వయంత్ర విదారణాయ
సర్వతంత్రాత్మకాయ
అవ్యక్తాయ
సువ్యక్తాయ
భక్తవత్సలాయ
వైశాఖశుక్లభూతోత్థాయ
శరణాగతవత్సలాయ
ఉదారకీర్తయే
పుణ్యాత్మనే
మహాత్మనే
చండవిక్రమాయ
వేదత్రయ ప్రపూజ్యాయ
భగవతే
పరమేశ్వరాయ
శ్రీ వత్సాంకాయ
శ్రీనివాసాయ
జగద్వ్యాపినే
జగన్మయాయ
జగత్పాత్యాయ
జగన్నాథాయ
మహాకాయాయ
ద్విరూపభృతే
పరమాత్మనే
పరంజ్యోతిషే
నిర్గుణాయ
నృకేసరిణే
పరతత్త్వాయ
పరంధామాయ
సచ్చిదానందవిగ్రహాయ
లక్ష్మీనృసింహాయ
సర్వాత్మనే
ధీరాయ
ప్రహ్లాదపాలకాయ

# శ్రీ మహాలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.

ప్రకృత్యై
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచ్యై
పద్మాలయాయై
పద్మాయై
శుచ్యై
స్వాహాయై
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై
ఆదిత్యై
దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
కమలాయై
కాంతాయై
కామాక్ష్యై
క్రోధసంభవాయై
అనుగ్రహప్రదాయై
బుద్ధ్యై
అనఘాయై
హరివల్లభాయ
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోకశోక వినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాయై
లోకమాత్రే
పద్మప్రియాయై
పద్మహస్తాయై
పద్మాక్ష్యై
పద్మసుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై
పద్మిన్యై
పద్మగంధిన్యై
పుణ్యగంధాయై
సుప్రసన్నాయై
ప్రసాదాభిముఖ్యై
ప్రభాయై
చంద్రవదనాయై
చంద్రాయై
చంద్రసహోదర్యై
చతుర్భుజాయ
చంద్రరూపాయ
ఇందిరాయై
ఇందు శీతలాయై
ఆహ్లోదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వజనన్యై
తుష్ట్యై
దారిద్ర్య నాశిన్యై
ప్రీతిపుష్కరిణ్యై
శాంతాయై
శుక్లమాల్యాంబరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై
వసుంధరాయై
ఉదారాంగాయై
హరిణ్యై
హేమామాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధ్యై
స్త్రైణ సౌమ్యాయై
శుభప్రదాయై
నృపవేశ్మగతానందాయై
వరలక్ష్మ్యై
వసుప్రదాయై
శుభాయై
హిరణ్యప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మంగళదేవ్యై
విష్ణువక్షస్థలస్థితాయై
విష్ణు పత్న్యై
ప్రసన్నాక్ష్యై
నారాయణసమాశ్రితాయై
దారిద్ర్యధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మవిష్ణుశివాత్మికాయై
త్రికాలజ్ఞాన సంపన్నాయై
భువనేశ్వర్యై

## ధూపం

శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం గోఘృతేన సమన్వితం
ధూపం గృహాణ దేవేశ సర్వలోక నమస్కరా॥
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
ధూపమాఘ్రాపయామి (ధూపమును సమర్పించవలెను)

## దీపం

శ్లో॥ త్రిలోకేశ మహాదేవ సర్వజ్ఞాన ప్రదాయక ।
దీపం దాస్యామి దేవేశ రక్షమాం భక్తవత్సల ।
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
దీపం దర్శయామి (దీపాన్ని చూపవలెను).

## నైవేద్యం

శ్లో॥ సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైష్షడ్భి స్సమన్వితం ।
నైవేద్యంతు మయానీతం గృహాణ పురుషోత్తమ॥

శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః నైవేద్యం సమర్పయామి (నైవేద్యమును సమర్పించాలి. అరటిపండ్లయితే కదలీఫలం కొబ్బరి నారికేళ ఫలం నివేదయామి అనియు బెల్లం ముక్క అయితే గుడోపహార నైవేద్యం సమర్పయామి అని చెప్పవలెను)

ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓమ్ ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, ఓం పరబ్రహ్మణే స్వాహా (ఉదకమును ప్రోక్షిస్తూ) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్, ఓమాపో జ్యోతీరాపో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోం (స్వామికి చేతితో చూపవలెను)

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి

(ఉదకమును విడిచి పెట్టవలయును)

అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళ యామి, పాదౌ ప్రక్షాళయామి, పునరాచమనీయం సమర్పయామి.

## తాంబూలం

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం,
ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం
తాంబూలం సమర్పయామి.

## నీరాజనం

శ్లో॥ హిరణ్య కశిపుర్యస్యకోపాగ్నౌ శలభాయితః ।
సర్వాంతర్వ్యాపినే శ్రీమన్నృసింహాయ మంగళమ్ ॥
శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
నీరాజనం దర్శయామి (నీరాజనం సమర్పించి ఉద్ధరిణితో ఉదకాన్ని తీసుకొని)
నీరాజననాంతరం పునరాచమనీయం సమర్పయామి
(అని ఉదకాన్ని వీడవలయును)

## మంత్రపుష్పం

ధాతా పురస్తాద్యముదాజహార, శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః
తమేవం విద్వానమృత ఇహ భవతి, నాన్యః పంథా ఆయనాయ విద్యతే
ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం,
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్.
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం.
విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి,
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్.
నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణః పరః
నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః
యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్య తే శ్రూయతే పివా.
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః,

అనంతమవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువం
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం.
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి.
జ్వాలమాలాకులంభాతీ విశ్వస్యాయతనం మహత్.
సంతతగ్ం శిలాభిస్తులంబత్యా కోశసన్నిభమ్.
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్త్సర్వం ప్రతిష్ఠితమ్.
తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః,
సోऽగ్రభు గ్విభజన్తిష్ఠ న్నాహార మజరః కవిః,
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా,
సంతాపయతి స్వందేహ మాపాదతలమస్తకః,
తస్యమధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః
నీలతో యద మధ్యస్తా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతాభా స్త్యణూపమా,
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
సబ్రహ్మ సశివ, స్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్వరాట్
ఋతగ్ం సత్యంపరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళం
ఊర్థరేతం విరూపాక్షం విశ్వ రూపాయ వై నమో నమః
ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణు ప్రచోదయాత్
రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే. నమోవయంవై శ్రవణాయ కుర్మహే
సమేకా మాన్కామకామాయ మహ్యం కామేశ్వరో వై శ్రవణో దదాతు,
కుబేరాయ వై శ్రవణాయ మహారాజాయ నమః

ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మాః,
ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురో నమః
అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు,
త్వం యజ్ఞ స్త్వం వషట్కారస్త్వం మిన్ద్రస్త్వం రుద్రస్త్వం
విష్ణుస్త్వం బ్రహ్మాస్త్వం ప్రజాపతిః.

త్వం తదాప అపోజ్యోతీ రసో మృతం బ్రహ్మ
భూర్భువ స్సువరోమ్.
ఈశాన స్సర్వవిద్యా నామీశ్వరస్సర్వభూతానాం
బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మాశివోమేఅస్తు సదాశివోమ్ ।
ఓం నృసింహాయ విద్మహే
వజ్ర నఖాయ ధీమహి
తన్నస్సింహః ప్రచోదయాత్

శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః
సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి.

## ప్రదక్షిణ నమస్కారాః

శ్లో॥ యానికానిచ పాపాని జన్మాన్తరకృతానిచ
తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదేపదే

శ్లో॥ పాపో హం పాపకర్మా హం పాపాత్మా పాపసమ్భవః
త్రాహిమాం కృపమయా దేవ । శరణాగతవత్సల ।

శ్లో॥ అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన ।

శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పై మంత్రాన్ని పఠించుచూ స్వామినే స్మరిస్తూ మూడు సార్లు ప్రదక్షిణలు చేసి సాష్టాంగ నమస్కారం చేసి పిమ్మట వివిధోపచార పూజను చేయవలెను.)

## వివిధోపచార పూజలు

ఛత్రం ధారయామి, చామరం వీచయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, వాద్యం ఘోషయామి, ఆందోళికాన్ ఆరోహయామి, అశ్వానా రోహయామి, గజానా రోహయామి, సమస్త రాజోపచార, శక్త్యోపచార, యన్త్రోపచార, దేవోపచార, సర్వోపచార పూజాం సమర్పయామి.

# క్షమార్పణం

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే
(నమస్కరించవలెను)

అనయాధ్యానా వాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామి స్వరూపో భగవాన్ సుప్రీత స్సుప్రసన్నో, వరదోభవతు. శ్రీ నరసింహ దేవప్రసాదం శిరసా గృహ్ణామి.
తీర్థం పుచ్చుకొనుట.

శ్లో॥ అకాల మృత్యు హరణం సర్వవ్యాధి నివారణం
సమస్త పాపక్షయకరం శ్రీ నరసింహ పాదోదకం పావనం శుభమ్
(అనుచు స్వామి వారి పాదోదకాన్ని పుచ్చుకోవలెను.)

నైవేద్యం - ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యంత్వర్తేన పరిషించామి, అమృతమస్తు అమృతో పస్తరణమసి, ఓం ప్రాణాయ స్వాహా..... ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మణేస్వాహా, శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామినే నమః మహా నైవేద్యం సమర్పయామి.

అమృతాపి ధానమసి ఉత్తరా పోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

తాంబూలం సమర్పయామి, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, అనయాధ్యానా వాహనాదిషోడ శోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామి సుప్రీతస్సు ప్రసన్నో వరదో భవతు శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామి ప్రసాదం శిరసా గృహ్ణామి.

ఉద్వాసనం - యజ్ఞేనయజ్ఞమయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్, తేహనాకం మహిమానస్సచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతి దేవాః

(శ్రీ లక్ష్మీ సమేత శ్రీ నరసింహ స్వామి యధాస్థానం ఉద్వాసయామి)

# శ్రీ నృసింహ మంగళా శాసనమ్

(వ్రతం అనంతరం చదువుకొనవలెను)

శ్లో॥ శ్రీ పాణిగ్రహనోపాత్త మహావైభవశాలినే ।
తులసీదామ భూషాయ శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ భీకరాకార భాజ్కేసి భక్తానాం శ్రీకరాయతే
వశీకృతాయ యోగీన్ద్రైః శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ మన్దస్వాన్త గుహాలీన త మస్సన్తతిభాస్వతే
సర్వమన్త్ర స్వరూపాయ శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ రమా వక్షస్థలీ పలిప్తవర జ్యాజిసే తోరసే
నిత్యానంద స్వరూపాయ శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ చఞ్చచ్ఛశిఖరస్పర్థి దంష్ట్రారుచివిలాసినే ।
దారిద్ర్య దుఃఖ సంహర్త్రే శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ భక్త సన్దోహ సన్దేహభేదనాయాత్తచేతసే
వరదాన ప్రతీతాయ శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ ఆది వ్యాధి గ్రహ గ్రాహగ్రస్త లోకార్తి హారిణే
నిర్వ్యాజ కరుణాయాస్తు శ్రీనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ హిరణ్య కశిపుర్యస్యకోపాగ్నౌ శలభాయితః ।
సర్వాంతర్వ్యాపినే శ్రీమనృసింహాయ మంగళమ్ ॥

శ్లో॥ సుధాసహచరైర్భక్త వాంచితార్థ ప్రదైశ్శివైః
వీక్షణై రవతే లోకం శ్రీనృసింహాయ మంగళమ్ ॥

★★★

# శ్రీ లక్ష్మీ నరసింహ వ్రత కల్పము

## మొదటి అధ్యాయము

పూర్వకాలంలో అవంతీనగరంలోని కృష్ణపట్నంలో అనంతాచార్యులనే అర్చకులు వుండేవారు. ఆ ఊరిలోని యోగ నరసింహ స్వామి దేవాలయంలో స్వామివారిని సేవిస్తూ కాలం గడుపుతుండేవాడు. అతని భార్య సుమతి కూడా స్వామి యెడల ఎంతో భక్తి కలిగి వుండేది. ఆ దంపతులిద్దరూ అన్ని విషయాలలోను సంతోషంగా వున్నప్పటికీ వివాహం జరిగి పన్నెండు సంవత్సరాలైనప్పటికీ సంతానం కలగకపోవటం వారిని బాధిస్తూ వుండేది. రోజూ స్వామివారిని సంతాన విషయమై ప్రార్థిస్తుండేవారు.

ఇలా కొంతకాలం జరుగగా భక్తవత్సలుడైన స్వామి ఒకనాడు అనంతాచార్యులకు కలలో కనపడి ఇలా అన్నారు. ఓ ఆచార్య పురుషా! మీ దంపతులు రోజూ నన్నెంతో నియమ నిష్టలతో కొలుస్తుండటం నాకెంతో ఆనందాన్ని కలుగజేస్తున్నది. మీకు త్వరలో పండంటి కుమారుడు కలిగే మార్గం చెబుతాను వినవలసింది అని ఇలా చెప్పసాగారు. ఓ భక్తా! శ్రావణమాసం నిన్ననే ప్రారంభమైంది కదా. మరికొద్ది రోజులలో వచ్చే స్వాతి నక్షత్రం నాడు నరసింహ వ్రతం ఆచరింపవలసింది. ఆ వ్రత ఫలితంగా నీకు తప్పక సంతానం కలుగుతుంది. ఈ వ్రతం చాలా సులభతరమైనది. రేపు ఉదయం ఈ ఆలయానికి విశ్వనాథుడు అనే భక్తుడు దూర దేశం నుండి వస్తాడు. నా ప్రియభక్తుడైన విశ్వనాథుడు ఈ వ్రతవిధానమంతా మీకు వివరంగా చెప్తాడు. ఆ ప్రకారంగా వ్రతం ఆచరించినచో త్వరలో సంతానం కలుగుతుంది అని చెప్పి అంతర్ధానమైనాడు.

అనంతాచార్యులు ఉదయం లేవగానే తన భార్య సుమతికి ఈ విషయం చెప్పాడు. ఆమెకూడా ఎంతో సంతోషపడింది. ఆ దంపతులిద్దరూ రోజూకంటే ముందుగానే నిత్యకృత్యాలను తీర్చుకుని ఆలయంలోకి వచ్చారు. శ్రీ స్వామివారికి సుప్రభాతం, అర్చన పూర్తయ్యే సమయానికి ఒక ముసలి బ్రాహ్మణ భక్తుడు వచ్చి అక్కడున్న భక్తులతోపాటు నిల్చున్నాడు. నివేదన పూర్తి కాగానే అనంతాచార్యులు అక్కడ వున్న భక్తులందరికీ ప్రసాదం పంచి పెడుతూ ఈ ముసలి బ్రాహ్మణుని వద్దకు వచ్చాడు. ప్రసాదం తీసుకున్న అతని

ముఖంలో చిరునవ్వు కనిపించింది. రాత్రి స్వామివారు చెప్పిన విశ్వనాథుడు ఇతనే అయి వుంటాడని అనంతాచార్యులకు అనిపించింది.

అప్పుడు ఆ భక్తుడు తనను విశ్వనాథునిగా పరిచయం చేసుకుని అనంతాచార్యుల దంపతులను దగ్గరకు పిలిచి 'ఓ భక్తులారా! మీరంటే శ్రీ స్వామివారికి ఎంతో ప్రియం. మీకు ఆ స్వామి అనుగ్రహం త్వరలోనే తప్పక కలుగుతుంది' అని దీవించాడు. అప్పుడు ఆ దంపతులు విశ్వనాథునికి నమస్కరించి స్వామీ నీకివే మా నమస్కారములు. రాత్రి స్వామి కలలో చెప్పిన విశ్వనాథుడనే భక్తుడు మీరేనని గ్రహించాము. మాయందు దయవుంచి శ్రీ నరసింహ వ్రత విధానమును వివరముగా చెప్పవలసింది అని అన్నారు.

అప్పుడు విశ్వనాథుడు ఆ దంపతులతో 'నాయనలారా! తప్పక చెప్తాను. ఇదంతా ఆ స్వామి అనుగ్రహం తప్ప మరొక్కటి కాదు. శ్రీ నరసింహ స్వామి వారి అనుగ్రహంతోనే నేనీ వ్రత విధానం మీకు చెప్పగలుగుతున్నాను. సావధానంగా వినండి'. అని శ్రీ నరసింహ వ్రత విధానం ఈవిధంగా చెప్పసాగాడు. 'ఓ భక్తులారా శ్రీ నరసింహ వ్రతము అతి మహిమాన్వితమైనది. నియమనిష్టలతో ఈ వ్రతం ఆచరించినవారికి సర్వ శుభాలూ చేకూరుతాయి. ఎటువంటి అనారోగ్యమైనా ఇట్టే మాయమౌతుంది. ఎటువంటి శత్రు భయం కాని, మానసిక సమస్యలు గానీ, శరీర బాధలు కానీ, గ్రహపీడలు కాని ఎంతటివైనా ఈ వ్రతమాచరించిన వెంటనే తొలగిపోతాయి. ఈ వ్రతమాచరించిన వెంటనే సర్వ శుభములు కలిగి ధనధాన్యములు లభిస్తాయి. ఈ వ్రతాన్ని ఏ నెలలోనైనా, ఏ రోజునైనా తిథి, వార, నక్షత్రాలతో సంబంధం లేకుండా ఆచరించవచ్చు. శ్రీ లక్ష్మీ నరసింహుల పటం ఎదురుగా వుంచుకుని, ముందుగా విఘ్నేశ్వరుని పూజించి, అటుపై కలశారాధన చేసి శ్రీ స్వామివారికి షోడశోపచార పూజ చేయవలయును. ఆ తరువాత అయిదు అధ్యాయములను చదువుకొనవలయును. చక్కెర కలిపిన గోధమరవ్వ కానీ, బొంబాయి రవ్వకానీ ప్రసాదముగా నివేదించవలెను. దీనితోపాటు పులిహోరను కూడా నివేదించిన శ్రేష్ఠము. ఈ వ్రతము ముఖ్యముగా మాఘ, వైశాఖ, శ్రావణ, కార్తీక, మార్గశిర మాసములందు కానీ దశమి, ఏకాదశి, పౌర్ణమి తిథులయందు కానీ, పూర్వాఫల్గుణి, స్వాతి, శ్రవణ, నక్షత్రములయందు కానీ ఆచరించిన మిక్కిలి ఫలదాయకము. ఈ వ్రతము ఏ ఇంట్లో ఆచరిస్తే ఆ కుటుంబ సభ్యులందరికీ, కథలను విన్నవారికినీ, ప్రసాదము

స్వీకరించిన వారికినీ సకల శుభములు కలుగును. దేవాలయములయందు ఆచరించినచో ఆ గ్రామముకేకాక, చుట్టు ప్రక్కల వున్న గ్రామముల ప్రజలందరికీ శుభప్రదము. చక్కటి వానలు కురిసి, పాడిపంటలు సమృద్ధిగా వుండగలవు. వ్యాపారస్థులకు ఎంతో లాభము చేకూరును. విద్యనభ్యసించు చున్నవారికి మంచి ఉద్యోగము లభించును. కన్యలకు మంచి వరులతో వివాహము కాగలదు. స్త్రీలందరు కలకాలం సుమంగళీమణులుగా వుండెదరు. ఆ గ్రామములలోని ప్రజలందరికీ సర్వశుభములూ చేకూరును అని చెప్పాడు. ఈ వ్రతాన్ని మీ దంపతులిద్దరూ వచ్చే స్వాతీ నక్షత్రం నాడు ఆచరించి స్వామి అనుగ్రహంతో చక్కటి సంతానాన్ని పొందగలరు' అని అన్నాడు.

అప్పుడు అనంతాచార్యుల దంపతులు విశ్వనాథునితో 'స్వామీ! మీరెక్కడినుంచి వచ్చారో మాకు తెలియదు. వయస్సులో మాకు తండ్రివలె వున్నారు. దయచేసి స్వాతి నక్షత్రం దాకా మా ఇంటనే వుండి ఆ రోజు మా చేత శ్రీ స్వామివారి వ్రతమును ఆచరింపచేసి మమ్ములను ధన్యులను చేయవలసింది అని ప్రార్థించారు. అప్పుడా ముసలి బ్రాహ్మణుడు అలాగేనని అంగీకరించాడు. ఆ విధంగా అనంతాచార్యుల దంపతులిద్దరూ ఎంతో భక్తి శ్రద్ధలతో శ్రీ నారసింహ వ్రతం ఆచరించి స్వామి అనుగ్రహంతో చక్కటి కుమారుని పొందారు. ఆ దంపతులిద్దరూ కలకాలం స్వామిని సేవించి, సుఖసంతోషాలతో జీవించి చివరన ముక్తిని పొందారు.

ఓం శ్రీ లక్ష్మీ నారసింహాయ నమ:

ప్రథమ అధ్యాయము సమాప్తము.

# శ్రీ లక్ష్మీ నరసింహ వ్రత కల్పము

## రెండవ అధ్యాయము

పూర్వకాలంలో కళింగ దేశాన్ని విక్రమసింహుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. విక్రమ సింహుడు ఎంతో తెలివిగల మంత్రుల సహాయ సహకారాలతో రాజ్యాన్ని జనరంజకంగా పాలించేవాడు. ఇందువలన చుట్టుప్రక్కల వుండే రాజులకు విక్రమసింహునిపై ఈర్ష్యగా వుండేది. వీలున్నప్పుడల్లా దండయాత్రలు చేస్తుండేవారు. అయితే విక్రమసింహుని అపార పరాక్రమానికి తట్టుకోలేక ఎప్పుడూ ఓడిపోతుండేవారు. వీరిలో ముఖ్యంగా పక్కనే వున్న కోసల దేశపు రాజు ఎన్నిసార్లు ఓడినప్పటికీ తిరిగి దండయాత్ర చేస్తుండేవాడు. రోజులిలా గడుస్తుండగా విక్రమసింహునికి చివరికి విసుగు వచ్చింది. కోసలరాజును పూర్తిగా అణచివేయాలనే ఉద్దేశ్యంతో పెద్ద ఎత్తున సైన్యాన్ని సమాయత్తం చేసి మంత్రులు నిశ్చయించిన శుభముహూర్తానికి యుద్ధానికి బయలుదేరాడు.

కోసల దేశం చేరడానికి దాదాపు వారం రోజులు పడుతుంది. సైన్యంతో సహా విక్రమసింహుడు రాత్రిపూట విశ్రమిస్తూ పగలు ప్రయాణం సాగించేవాడు. ఇలా రెండు రోజులు గడిచి మూడవరోజు రాత్రి చీకటి పడగానే ఒక గ్రామం వెలుపల సైన్యంతో సహా విక్రమసింహుడు విశ్రమించాడు. మంత్రులతో యుద్ధ సన్నాహాల గురించి మాట్లాడుతుండగా ఒక భటుడు వచ్చి 'మహారాజా! నాదొక చిన్న విన్నపం. ఇక్కడ సమీపంలో సింగమపల్లె అనే గ్రామం వుంది. ఆ గ్రామంలో పురాతన కాలం నాటి శ్రీ నరసింహ ఆలయం వున్నది. అందులో స్వామి యోగ, అభయ, జ్వాల, ధ్యాన, లక్ష్మీ నరసింహుడనే అయిదు రూపాలలో వెలసి తర తరాలుగా భక్తుల పూజలందుకుంటున్నాడు. ఆ స్వామిని తమరు దర్శించవలసిందిగా నా ప్రార్థన' అన్నాడు. రాజు అందుకు ఒప్పుకుని మంత్రులతో కలిసి ఆలయానికి వెళ్లి శ్రీ స్వామివారిని దర్శించుకుని మనస్సులో ఇలా ప్రార్థించాడు. ఓ స్వామీ! నారసింహా! నేనీయుద్ధంలో జయప్రదంగా గెలిచి వచ్చి నా దేశానికి వెళ్ళేటప్పుడు తిరుగు దారిలో నిన్ను దర్శించుకుంటాను. అంతేకాక రాజ్యం చేరగానే నీ వ్రతం ఆచరిస్తాను. ఈ యుద్ధంలో నాకు అఖండ విజయాన్ని అనుగ్రహింపవలసింది అని ప్రార్థించాడు. ఈ విషయాన్నే తన ప్రధానమంత్రి అయిన ధర్మబుద్ధికి కూడా చెప్పాడు.

తిరిగి తెల్లవారగానే విక్రమసింహుడు సైన్యంతో సహా బయలుదేరి ఆ వారం చివరికల్లా

కోసల రాజ్యం చేరుకుని శ్రీ నరసింహుని అనుగ్రహంతో భీకర యుద్ధంలో కోసల రాజుని ఓడించాడు. కోసలరాజు విక్రమసింహునికి బందీగా చిక్కి ఇక ఎప్పటికీ కళింగపై దండయాత్ర చేయనని అర్థించగా అతనిని విడిచిపెట్టాడు. విక్రమసింహుని సైన్యమంతా ఆనందోత్సాహాలతో తిరుగుముఖం పట్టింది. ఈ ఆనందంలో విక్రమసింహుడు నరసింహునికి ఇచ్చిన మాట మరిచిపోయాడు. కళింగ రాజ్యం చేరి పట్టపురాణితో ఆనందిస్తున్నాడు. నెలలు గడిచాయి కానీ నరసింహ స్వామి గురించి ఆలోచనే లేదు. స్వామివారికి ఆగ్రహం వచ్చింది. అంతే! ఆ రోజు రాత్రి విక్రమసింహునికి ఏదో వింత వ్యాధి సోకి కాళ్ళు, చేతులు పడిపోయాయి. నోటిమాట కూడా సరిగా రావట్లేదు. రాజవైద్యులు ఎన్నివిధాల ప్రయత్నించినా ఏ మాత్రం మార్పు కనిపించలేదు. రోజు రాత్రివేళల భయంగా, గట్టిగా అరిచేవాడు. మంత్రులెవరికీ కూడా ఇలా ఎందుకు జరిగిందీ కూడా అర్థం కావడం లేదు. ఒకనాటి రాత్రి ప్రధానమంత్రి ధర్మబుద్ధికి కలలో అయిదు సింహాలు భయంకరంగా అరుస్తూ కనబడ్డాయి. ఈ కల ఆంతర్యం ఏమై వుంటుందా అని తలుస్తుండగా మంత్రికి రాజు కోసల దేశంపై యుద్ధానికి వెళ్లినప్పుడు దారిలో నరసింహ స్వామి దర్శనం చేసుకోవడము, స్వామివారి వ్రతం ఆచరిస్తానని అనడమూ గుర్తుకు వచ్చింది. ఇందువలననే ఇంత అనర్థం జరిగినట్లు గ్రహించాడు.

ధర్మబుద్ధి వెంటనే అంత:పురానికి వెళ్ళి రాణికి ఈ విషయమంతా తెలియజెప్పాడు. ఆ నాడు స్వాతి నక్షత్రం కావడంచేత ఆ రోజు సాయంత్రమే స్వామివారి వ్రతం ఆచరించడానికి నిశ్చయించుకుని రోజంతా పూర్తి ఉపవాసం వుండి రాణి సాయంత్రం కాగానే ఎంతో భక్తి శ్రద్ధలతో శ్రీ నరసింహ వ్రతం ఆచరించింది. శ్రీ స్వామి వారి అనుగ్రహంతో విక్రమసింహునికి కొన్ని రోజులలోనే అనారోగ్యం తొలగిపోయింది. ఒక శుభముహూర్తాన రాజు, రాణీ సమేతుడై సకల పరివారంతో సింగమపల్లె చేరుకుని అక్కడ వున్న పంచ నారసింహులను సేవించి, తనను క్షమించవలసిందిగా ప్రార్థించాడు. ఆ రాత్రికి ఆ క్షేత్రంలోనే నిద్ర చేశాడు. మరునాడు అక్కడే శ్రీ స్వామి వారి వ్రతం ఆచరించి, తీర్థ ప్రసాదాలను తీసుకుని తిరిగి రాజ్యానికి వెళ్ళి సుఖ సంతోషాలతో జీవిస్తూ కలకాలం ప్రజారంజకంగా పాలించాడు.

ఓం శ్రీ లక్ష్మీ నారసింహాయ నమ:

ద్వితీయ అధ్యాయము సమాప్తము.

# శ్రీ లక్ష్మీ నరసింహ వ్రత కల్పము

## మూడవ అధ్యాయము

పూర్వకాలంలో గోదావరీ నదీ తీరంలో కృష్ణగిరి అనే ఊరుండేది. ఆ ఊరికి ఒక ప్రక్కన దట్టమైన అడవి వుండేది. ఆ ఊరి జనాభా అంతా కలిసి అయిదారు వందలలోపే వుండేవారు. కృష్ణగిరి చుట్టూ నల్లని రాతి గుట్టలుండడం చేత ఆ ఊరికి ఆ పేరు వచ్చింది. ఆ గుట్టలలో ఒక ఎత్తైన గుట్టపై శ్రీ లక్ష్మీ నరసింహ దేవాలయం వున్నది. ఆ దేవాలయం ఎంతో పురాతనమైనదిగా ప్రసిద్ధి గాంచింది. ఇక్కడ నరసింహ స్వామిని సాక్షాత్తూ పరమశివుడే సేవించి వున్నాడని భక్తులు చెప్తుండేవారు. స్వామిని నమ్ముకున్నవారికి ఎటువంటి ఆపదలూ రాకుండా జీవితమంతా సుఖమయంగా గడిచిపోతుందని అందరి విశ్వాసం, ప్రగాఢ నమ్మకం. ఆ నమ్మకానికి తగినట్టుగానే స్వామిని కొలిచిన వారికి ఎటువంటి అనారోగ్యాలూ దరిచేరకుండా జీవితమంతా ఎంతో శుభప్రదంగా గడిచిపోతుండేది.

స్వామివారి ఆలయంలో శ్రీనివాసాచార్యులు అనే అర్చకుడుండేవాడు. తన తాతలనాటివారు ఈ వూరికి వలస వచ్చి స్వామిని సేవిస్తూ వుండటంతో తాను కూడా ఇక్కడే వుండి స్వామి కైంకర్యానికే తన జీవితాన్ని అంకితం చేసుకున్నాడు. రోజూ ఆలయానికి వచ్చే భక్తులచే అర్చనాది పూజలను నిర్వరిస్తూ స్వామికి నిత్య ధూప, ధీప నైవేద్యాలను అత్యంత నియమ నిష్టలతో జరుపుతుండేవాడు. శ్రీనివాసాచార్యులవారి భార్య సుగుణవతి కూడా ఉదయాన్నే లేచి పువ్వులు కోసి స్వామిసేవలో తను కూడా పాల్గొనేది.

ఆ దంపతులకు ఇద్దరు కుమార్తెలు. శ్రీలక్ష్మి, జయలక్ష్మి ఇద్దరూ ఎంతో బుద్ధిమంతులు. కొంతకాలానికి శ్రీలక్ష్మికి యుక్త వయస్సు వచ్చి తండ్రి వివాహ ప్రయత్నం ప్రారంభించాడు. తనకు తెలిసినవారికి తన కుమార్తె వివాహానికి వున్నదని, యోగ్యులైన వరులు ఎవరైనా వుంటే చెప్పవలసిందని విన్నవించుకున్నాడు. రోజూ ఉదయం సుప్రభాత సమయంలో శ్రీ లక్ష్మీ నారసింహులను కుమార్తెకు మంచి వరునితో వివాహం నిశ్చయమవ్వాలని ప్రార్థించేవాడు.

తనను నమ్మిన వారికి సమస్త భాగ్యాలనూ ప్రసాదించే నారసింహునికి ఆచార్యులవారిపై కరుణ కలిగింది.

ఇంతలో ఆ ఊరికి పదిహేనుమైళ్ళ దూరంలో గల రామగిరి శ్రీరామాలయంలో స్వామి వారి కళ్యాణ మహోత్సవానికి శ్రీనివాసాచార్యులకు ఆహ్వానం వచ్చింది. శ్రీనివాసాచార్యులు సతీ సమేతంగా బయలుదేరి కుమార్తెలను కూడా తన వెంట తీసుకునివెళ్ళి నాలుగు రోజులు అక్కడే వుండి స్వామి కళ్యాణ ఉత్సవాలలో పాల్గొని శ్రీ సీతారామచంద్రులను సేవించుకున్నాడు. అక్కడకు వచ్చిన బ్రాహ్మణులలో ఒకరికి వేంకటనాథుడనే కుమారుడు వివాహానికి కలడని తెలిసింది. శ్రీ నారసింహుని అనుగ్రహంతో శ్రీలక్ష్మి, వేంకటనాథుల జాతకాలు అద్భుతంగా కలవడం జరిగింది. ఇద్దరి కుటుంబాలకు ఎంతో సంతోషం కలిగి వివాహం నిశ్చయమైంది. మంచి ముహూర్తం చూసుకుని నిశ్చయ తాంబూలాలు తీసుకొనడానికి ఇరుకుటుంబాలవారు నిర్ణయించుకుని శ్రీనివాసాచార్యులు కృష్ణగిరి తిరిగి వెళ్ళాడు.

రెండు నెలల తరువాత ఒక సుముహూర్తంనాడు కుమార్తె నిశ్చయ తాంబూలాలకై శ్రీనివాసాచార్యుల దంపతులు బంధుమిత్రులు వెంటరాగా కృష్ణగిరి నుంచి అడవి మార్గం ద్వారా రామగిరి బయలుదేరారు. ఎడ్ల బండ్లలో కబుర్లు చెప్పుకుంటూ ఆ కుటుంబాలు సగం దూరం చేరుకునేసరికి ఒక్కసారిగా ఎక్కడినుంచో వచ్చిందో కానీ ఒక దొంగల గుంపు వీరిపై పడింది. ఆ దొంగలను చూసేసరికి అందరూ ఎంతో భయపడ్డారు. తమ కుమార్తె వివాహ నిశ్చయ తాంబూలాలకై వెళుతున్నామని, తమను విడిచిపెట్టమని శ్రీనివాసాచార్య దంపతులు ఆ దొంగలను ఎంతో ప్రాధేయపడ్డారు. కానీ లాభం లేకపోయింది. దొంగలు ఎంతో క్రూరంగా వుండి వీరి సర్వస్వమూ దోచుకోసాగారు.

అప్పుడు శ్రీనివాసాచార్యులు ఇక చేసేది లేక మనస్సులో తాను నమ్ముకున్న నరసింహుని తలచుకున్నాడు. 'స్వామీ! ఆపద్బాంధవా ఈ అడవిలో మాకు నీవు తప్ప అన్యథా శరణం నాస్తి, నీవే మమ్ములను రక్షింపవలసినది' అని ప్రార్థించాడు. అంతే! ఒక్కసారిగా పక్కన వున్న పొదలనుంచి మెరుపు వేగంతో ఒక సింహం ఆ దొంగలపై దూకింది. సింహాన్ని చూసిన దొంగలతో పాటు శ్రీనివాసాచార్యుల కుటుంబాలకు కూడా ఒక్క క్షణం భయం కలిగింది. కానీ విచిత్రంగా ఆ సింహం దొంగలను తప్ప శ్రీనివాసా

చార్యుల కుటుంబాల జోలికే రాలేదు. అంతలోనే మరొక అద్భుతం. సింహాన్ని చూస్తే సాధారణంగా బెదిరిపోయే ఎద్దులు కూడా ఏ మాత్రం బెదరకుండా నిల్చుని వున్నాయి. సింహం అంతగా గర్జిస్తున్నప్పటికీ ఎద్దులలో ఏ మాత్రం భయం కనిపించలేదు. సింహం ఉనికి లేనట్లుగానే వున్నాయి. ఒక్క క్షణంలో ఆ సింహం ఉగ్రరూపంతో దొంగలనందరిని మట్టు పెట్టి ఒక్క ఉదుటున పొదలలోకి దూకి మాయమైంది.

అప్పుడు శ్రీనివాసాచార్యులకు, వారి బంధువులకు సింహం రూపంలో వచ్చినది సాక్షాత్తూ ఆ నారసింహుడే అని అర్థమైంది. తమను రక్షించడానికి వచ్చిన ఆ స్వామిని అందరూ అనేక స్తోత్రాలతో స్తుతించారు. తమ ప్రయాణం సాగించి నిశ్చయ తాంబూలాలను ఘనంగా నిర్వహించుకున్నారు. ఆ తర్వాత కొంతకాలానికి ఒకానొక శుభముహూర్తాన వేంకటనాథునికి, శ్రీలక్ష్మికి వైభవంగా వివాహం జరిగింది. ఆ దంపతులిద్దరూ శ్రీ లక్ష్మీ నారసింహులను సేవిస్తూ కలకాలం సుఖసంతోషాలతో జీవించారు.

ఓం శ్రీ లక్ష్మీ నారసింహాయ నమః

తృతీయ అధ్యాయము సమాప్తము.

# శ్రీ లక్ష్మీ నరసింహ వ్రత కల్పము

## నాలుగవ అధ్యాయము

పూర్వకాలంలో కళింగ దేశంలో నర్శింగపురమనే పట్టణం ఉండేది. పేరుకి పట్టణమే అయినా చూడటానికి విశాలమైన పల్లెలాగా ఉండేది. ప్రజలందరూ సుఖసౌఖ్యాలతో ఉండేవారు. ఆ పట్టణంలో పురాతన కాలం నాటి శ్రీ లక్ష్మీ నరసింహ ఆలయం ఉండేది. ఇక్కడ ఉన్న స్వామి, అమ్మవార్ల విగ్రహాలకు ఒక ప్రత్యేకత ఉండేది. భక్తులు ఎటు నుంచుని చూస్తే శ్రీ లక్ష్మీనరసింహులు అటు వైపే చూస్తున్నట్లు అనిపించేది. ఎడమ పక్కన ఉంటే ఎడమవైపు చూస్తున్నట్లు, కుడిపక్కన నుంచి ఉంటే కుడివైపు చూస్తున్నట్లు ఉండేది. ఇక్కడ స్వామి ఎంతో మహిమాన్వితుడిగా కోరిన కోర్కెలు తీర్చే కామధేనువుగా పేరొందాడు. అక్కడ ఈ స్వామిని సాక్షాత్తు పరమేశ్వరుడే ప్రతిష్టించినట్లు, ఇక్కడ రోజూ రాత్రివేళ దేవతలందరూ స్వామిని సేవిస్తూ వుంటారని భక్తుల నమ్మకం.

రోజూ ఎందరో భక్తులు చుట్టుప్రక్కల గ్రామాల వారే కాకుండా, ఎంతో దూర ప్రదేశాలనుండి వచ్చి స్వామిని సేవించుకుండేవారు. వారిచ్చే కట్న, కానుకలతో దేవాలయం ఎంతో అభివృద్ధి చెందింది. భక్తులు స్వామికి సమర్పించిన దాదాపు 50 ఎకరాల భూమి ఉండేది. తరతరాలుగా ఎంతో మంది భక్తులు చేయించిన ఎన్నో విలువైన ఆభరణాలు ఉండేవి. ఈ ఆభరణాలను స్వామికి ప్రత్యేక ఉత్సవాలలో అలంకరించేవారు. ఆలయ ధర్మకర్త రామయ్య స్వామికే తన జీవితాన్ని అంకితం చేసి తన స్వంత ఖర్చుతో ఎన్నో కైంకర్యాలు గావించాడు.

ఆ ఊరిలోని ప్రముఖ భక్తులలో చలమయ్య ఒకడు. చలమయ్య ఎంతో ఆస్తిపరుడు. అయినా పరమ పీనాశి. ఎన్నో కల్తీ వ్యాపారాలు చేసి అన్యాయంగా సొమ్ము గడించాడు. కొంతకాలానికి ఇతని చూపు ఊరి దేవాలయంపైన పడింది. అదను చూసుకుని ఎలాగైనా దేవాలయంపై అధికారం చేజిక్కించుకోవాలని అనుకున్నాడు.

కొంతకాలానికి తన పలుకుబడినంతా ఉపయోగించి ఎంతో సన్మార్గుడైన రామయ్యను ధర్మకర్తల మండలి అధ్యక్షపదవి నుంచి తొలగించి తాను ఆ పదవిని ఆక్రమించాడు.

వారానికి ఒకసారి ఆలయానికి వచ్చి ఆ వారంలో భక్తుల నుంచి ఎన్ని కట్నకానుకలు వచ్చింది అర్చకులను అడిగి తెలుసుకునేవాడు. ప్రతినెలా హుండీ తెరిచి భక్తులు సమర్పించే కానుకలు తన మనుష్యులచే లెక్కింపచేసేవాడు. ఏవైనా విలువైన కానుకలు వస్తే అవి మెల్లగా ఇంటికి చేరవేసేవాడు. కొంతకాలానికి ఎంత పిసినారిగా మారాడంటే ప్రసాదంగా వచ్చే కొబ్బరి చిప్పలను కూడా ఇంటికి తీసుకెళ్ళి సత్రాలకు అమ్ముకునేవాడు.

చలమయ్య ఆగడాలన్ని చూసి ఆలయ అర్చకులకు ఎంతో బాధ కలిగేది. రోజూ స్వామికి తమ బాధ మొరపెట్టుకునేవారు. స్వామి! నిన్ను నీవే రక్షించుకో తండ్రీ! అని ప్రార్థించేవారు. స్వామి చలమయ్యను శిక్షించే రోజూ ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూసేవాడు.

ఇంతలో ఆ రోజు రానే వచ్చింది. ఆ రోజు రాత్రి చలమయ్యకు ఒక భీకరమైన కల వచ్చింది. ఆ కలలో ఒక సింహం మహోగ్రంగా అరుస్తూ తను పడుకున్న మంచం చుట్టూ తిరగసాగింది. మధ్యలో ఒక్కసారి తన పైనుంచి అటు, ఇటు గాండ్రిస్తూ దూకసాగింది. ఆ అరుపులకు చలమయ్య ప్రాణాలు పైనేపోయాయి. ఇంతే గాక తన ఇంట్లోని వస్తువులన్నింటినీ చిందరవందర చేసేసింది ఆ సింహం. ఉగ్రరూపంతో అరుస్తూ ఆ సింహం చేస్తున్న పనులకు చలమయ్య నోటిమాట రావట్లేదు. ఇంతలో తెల్లారింది. చలమయ్య కళ్ళు తెరిచాడు. అమ్మయ్య! ఎంత భయంకరమైన కల వచ్చింది అనుకుంటుండగా భార్య పరుగు పరుగున వచ్చి ఇంట్లోని వస్తువులన్నీ చిందరవందరగా పడేసి ఉన్నాయని చెప్పంది. చలమయ్య ఒక్క దూకున మంచం మీద నుంచి దిగాడు. ఎటు చూసినా భయంకరంగా కనిపించింది. అక్కడక్కడా గోడలపై సింహపు గోళ్ళ గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అయితే జరిగినదంతా కల కాదన్నమాట! ఇలా తలచుకోగానే మనస్సులో భయం పుట్టుకుంది. సింహం రూపంలో వచ్చింది సాక్షాత్తూ శ్రీ స్వామియే అని అర్థమయ్యింది.

తను చేసిన అన్యాయాలకు స్వామి ఈ విధంగా తనకు హెచ్చరించినట్లు తలుచుకున్నాడు. వెంటనే స్నానం చేసి ఆలయానికి వెళ్ళి పూర్వపు ధర్మకర్త రామయ్యకు కబురు పెట్టాడు. రామయ్య రాగానే ధర్మకర్తల అందరి సమక్షంలో అధ్యక్ష పదవికి తాను

రాజీనామా చేస్తున్నట్లు చెప్పి ఇకపై రామయ్యనే ఆ పదవిలో కొనసాగించాలని అన్నాడు. రాత్రికి రాత్రి చలమయ్యలో ఇంత మార్పు ఎలా వచ్చిందో ఎవరికీ అర్థం కాలేదు. ఆలయ అర్చకులందరూ తిరిగి రామయ్యను ఆలయ ధర్మకర్తను చేసినందుకు ఎంతో సంతోషించారు.

చలమయ్య తన దుర్మార్గాలన్నింటినీ కట్టి పెట్టి, స్వామికి కలకాలం సేవ చేసి బ్రతికినంత కాలం ఆ పట్టణంలోనే వుండి మంచి మనిషిగా పేరు తెచ్చుకున్నాడు.

ఓం శ్రీ లక్ష్మీ నారసింహాయ నమః

చతుర్థ అధ్యాయము సమాప్తము.

# శ్రీ లక్ష్మీ నరసింహ వ్రత కల్పము

## అయిదవ అధ్యాయము

పూర్వకాలంలో రత్నగిరి అనే పట్టణంలో కూర్మనాథుడనే వడ్రంగి ఉండేవాడు. అతని భార్య ఇందుమతి. భార్య భర్తలిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉంటూ రోజు తమకు వీలైన రీతిలో పూజలు చేస్తుండేవారు. పూర్వజన్మకర్మ ఫలితంగా వీరికి వివాహం అయి పది సంవత్సరాలు కావస్తున్నప్పటికీ సంతానం కలుగలేదు. ఈ దంపతులకు ఇది తీరని కోరికగా ఉండేది. కూర్మనాథుడు వడ్రంగి పనిలో ఎంతో నేర్పు సాధించుకొనడం చేత జీవితంగా సాఫీగానే సాగిపోతున్నది.

రోజులు ఇలా గడుస్తుండగా ఒకనాడు కూర్మనాథుడు ద్వారాలు చేసే పని రావడం చేత కలప కోసం ఆ ఊరి షావుకారు దగ్గరకు వెళ్ళాడు. ఆ షావుకారు నారాయణ శెట్టి కలప వ్యాపారం చేస్తూ దైవ చింతనలో కాలం గడిపేవాడు. తనకు కావల్సిన కలప తీసుకుని డబ్బు కట్టడానికి సిద్ధపడుతుండగా షావుకారు ఇంట్లో శ్రీ నరసింహ వ్రతం జరుగుతున్నదని తెలిసింది. షావుకారు ఇల్లు దుకాణం పక్కన ఉండడం చేత తానుకూడ వెళ్ళి వ్రతం చూద్దామని తలచి తను కొన్న కలపను అక్కడే పక్కన వుంచి ఇంటిలోనికి వెళ్ళాడు. ఇంట్లో వ్రతం అద్భుతంగా జరుగుతున్నది. నారాయణశెట్టి దంపతులిద్దరూ పీటలపై కూర్చుని వ్రతం చేస్తున్నారు. బంధువులు, స్నేహితులు కూడా ఎందరో వున్నారు. కూర్మనాథుడు కొద్దిగా వెనుకగా కూర్చుని వ్రతకథలు వింటున్నాడు. అలా రెండు కథలు విన్నాడు.

మూడో కథ మొదలయ్యే సమయానికి తన తమ్ముడు కాశీనాథుడు ఆయాసపడుతూ వచ్చి అన్నా నీ కోసం మనింటికి వేరే వూరినుంచి ఒక వ్యాపారి వచ్చాడు. వారింట్లో వడ్రంగి పని చాలా ఉన్నదట. నీవు ఇక్కడ వున్నావని తెలుసుకుని వచ్చాను. వెంటనే ఇంటికి వెళదాం. ఆలస్యమైతే ఆ వ్యాపారి మళ్ళీ తన వూరు వెళ్లిపోవాలంటున్నాడు అని అన్నాడు. అప్పుడు కూర్మనాథుడు ఒరేయ్ కాశీ! ఇక్కడ నరసింహ స్వామివారి వ్రతం

జరుగుతున్నది కదా. ఇప్పటికి రెండు కథలు అయిపోయాయి, మూడవది నడుస్తున్నది, మిగిలిన రెండు కథలు కూడా విని స్వామి వారి ప్రసాదం తీసుకుని వెళదాం అన్నాడు. కానీ కాశీనాథుడు వినడం లేదు. త్వరగా వెళదామని అంటున్నాడు. ఇంతలో నాలుగో కథ కూడా పూర్తి అయ్యింది. అయిదు కథలూ అయితే గానీ తాను ససేమిరా రానన్నాడు. కూర్మనాథుడు తమ్ముడు ఎంతో ఒత్తిడి పెడుతున్నప్పటికీ అయిదు కథలూ అయ్యేదాకా కదలలేదు. ఇంతలో అయిదవ కథ కూడా పూర్తయ్యింది. ప్రసాదాలు కొంచం ఆలస్యం అయ్యేలాగా కనపడుతున్నది. ఇది గమనించిన కాశీనాథుడు అన్నని తిరిగి బలవంతం చేశాడు. ఇక చేసేది లేక ప్రసాదం మళ్ళీ వచ్చి తీసుకునవచ్చునని తలచి తమ్ముడితో ఇంటికి వెళ్ళాడు. వ్యాపారితో పని విషయమై మాట్లాడేటప్పటికి సాయంకాలం అయ్యింది. ఈ హడావిడిలో ప్రసాదం సంగతి మర్చిపోయాడు.

శ్రీ నరసింహ వ్రతం కథలన్నీ విన్న ఫలితం చేత సంవత్సరానికల్లా కూర్మనాథుని దంపతులకు మగ సంతానం కలిగింది. కానీ దురదృష్టమేమిటంటే ఆ పిల్లవాడు పుట్టుకతోనే అవిటి కాలితో పుట్టాడు. మగపిల్లవాడు కలిగాడన్న సంతోషంతోపాటు ఈ విధంగా అవిటితనంతో జన్మించటం చూసి ఆ దంపతులు ఎంతో బాధపడ్డారు. పిల్లవాడికి ఏడు సంవత్సరాలు వచ్చాయి. అవిటితనం వలన నడవలేకపోయేవాడు. ఇలా వుండగా ఆ ఊరికి ఒక సాధువు వచ్చాడు. ఆ సాధువు ఎంతో మహిమలు గలవాడని నలుగురిద్వారా తెలుసుకుని కూర్మనాథుని దంపతులు ఆ స్వామిని కలిసి తమ పిల్లవాడిగురించి చెప్పారు. అప్పుడు ఆ సాధువు కాసేపు కనులు మూసుకుని కూర్మనాథునితో ఇలా అన్నాడు. నాయనా ఒక్కసారి గుర్తు తెచ్చుకో, నీవు కొంతకాలం క్రితం శ్రీ నరసింహ వ్రతం కథలు విని ప్రసాదం తీసుకొనకుండా వచ్చావు. అందువలన స్వామివారికి కోపం రావటం చేత ఈవిధంగా జరిగింది. ఆ పిల్లవాడి అవిటితనం పోయే విధానం చెబుతాను వినండి. ఈ పిల్లవాడిని తీసుకుని మీరు ఇక్కడకు ఇరువది మైళ్ళ దూరంలో గల ధ్యాన నరసింహుని ఆలయానికి వెళ్ళి అక్కడ వ్రతం చేయిస్తే పిల్లవాడికి తప్పక నయమవుతుందని చెప్పాడు.

కూర్మనాథుని దంపతులిద్దరూ తరువాత వారమే పిల్లవాడిని తీసుకుని బయలుదేరారు. ధ్యాన నరసింహుని ఆలయం ఒక పెద్ద గుట్టపై వున్నది. దాదాపు రెండు వందల మెట్లు ఎక్కి స్వామిని దర్శించుకోవాలి. కూర్మనాథుడు కుమారుని భుజాలపై ఎక్కించుకుని

ఒక్కొక్కమెట్టు ఆయాసపడుతూ ఎక్కసాగాడు. దాదాపు యాభై మెట్లు ఎక్కగానే ఒక చోట కాసేపు కూర్చుందామని తలచి పిల్లవాడిని భుజంపైనుంచి దించాడు. అంతే అద్భుతంగా పిల్లవాడి కాలు ఆ మెట్టుకి తగలగానే ఒక్కసారిగా అవిటితనం మాయమైంది. వారందరి ఆనందానికి అవధులు లేవు. పిల్లవాడు చక్కగా తనంతట తనే మెట్లన్నీ ఎక్కాడు. ఆ దంపతులు ఇదంతా స్వామి మహిమగా తలచి కొండ పైకెక్కి దేవాలయంలో శ్రీ ధ్యాన నరసింహుని దర్శించుకుని నరసింహ వ్రతాన్ని ఆచరించి కుటుంబమంతా తీర్థ ప్రసాదాలు తీసుకున్నారు. అప్పటినుంచి ప్రతినెలా వారు స్వాతీ నక్షత్రం నాడు దేవాలయానికి వచ్చి స్వామిని దర్శించి వ్రతం చేస్తూ కలకాలం సుఖంగా జీవించారు.

శ్రీ లక్ష్మీ నారసింహాయ నమ:

పంచమోధ్యాయము సమాప్తము.

హిరణ్య కశిపుర్యస్యకోపాగ్నౌ శలభాయితః ।

సర్వాంతర్వ్యాపినే శ్రీమన్నృసింహాయ మంగళమ్ ॥

శ్రీ లక్ష్మీ నరసింహ వ్రతకల్పము సమాప్తము.